నవ శిక్షిత సాహితమాల

# మేకల పెంపకం

రచన

వి. వెంకటప్పయ్య

చిత్రాలు

మనిష్ వర్మ



నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

ఈ పుస్తకం రాష్ట్రవయోజనవిద్యా వనరుల కేంద్రం, హైదరాబాదు, ఆంధ్రప్రదేశ్ మరియు నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా సంయుక్తంగా నిర్వహించిన వర్క్‌షాప్‌లో తయారు చేయబడినది.

ISBN 81-237-2515-9

ప్రథమ ముద్రణ 1998 *(శక 1920)*

© వి. వెంకటప్పయ్య, 1998

MEKALA PEMPAKAM *(Telugu Original)*

రూ. **6.00**

డైరెక్టర్, నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా, ఎ-5, గ్రీన్‌పార్క్, న్యూఢిల్లీ-110016 ద్వారా ప్రచురింపబడినది.

# విజయ గాథ - కొమరమ్మ కథ

మనకు తెలిసిందే మహబూబ్ నగర్ జిల్లా హైదరాబాదు సమీపంలో వుంది. అందు దుర్గు, కేశం పేట, ఫరూఖ్ నగర్ మండలాలు ఉన్నాయి. ఈ మండలాలు మేకలకు ప్రసిద్ధి. ఇందు ప్రతి ఊరిలో మేకలున్నాయి. పేదవారికి బాగా తోడ్పడుతున్నాయి. వీటివల్లే వారు తమ కాళ్ళపై తాము నిలబడగలుగుతున్నారు.

ఫరూఖ్‌నగర్ మండలంలో కొమ్మూరు ఒక గ్రామం. అచ్చట పరువ నరసింహులు పేదరైతు. అతని కూతురే కొమరమ్మ. వీరికి ఆదాయం చాలడం లేదు. పంట సరిపడా లేదు. పలు బాధలకు గురి అయినారు. పెద్దల సలహా పాటించారు. బ్యాంకు అప్పు తీసుకుని ఇరవై మేకలను పెంచారు. అచ్చట అటవీ ప్రాంతం అనుకూలంగా ఉంది. చాలినంత మేత ఉంది. మూడేళ్ళలో అప్పు తీరిపోయింది. మంచి ఆదాయం లభించింది. కొమరమ్మ ఆనందంగా ఉంది. ఈమె బాటలో మరికొందరు నడిచారు. ఆడవారే బాగా పెంచగలరు అని రుజువు చేశారు.

ఇది నిజంగా జరిగిన కథ. ఈ మంచి మార్గం అందరూ పాటించవచ్చు. మంచి లాభం పొందవచ్చు. ఈ మేకలను పెంచే తీరు పరిశీలిద్దాం.

## మేకలను పెంచడం లాభం

మేకల పెంపకం తేలిక. అందుకు లాభాలు చాలా ఉన్నాయి. మేకను పేదవాడి ఆవు అంటారు. మేక పాలను బాగా ఇస్తుంది. ఈ పాలు

ఆరోగ్యకరమైనవి. గాంధీజీ రోజూ మేక పాలు తాగేవారు. చిన్న పిల్లలకు ఈ పాలు మంచివి. వయసు ముదిరినా ఈపాలు మంచివి. రోగం నుండి కోలుకుంటున్న వారికీ ఇవి ఇవ్వవచ్చు. మేకలపాలు తేలికగా అరుగుతాయి, శక్తిని పెంచుతాయి. మేకలపాలతో జున్ను చేయవచ్చు. పాలకోవా చేయవచ్చు. మేకల మాంసానికి గిరాకి బాగా ఉంది. మేకలు రెండు, మూడు పిల్లలను పెడతాయి. చిన్న వయసులో చూలు కడతాయి. ఏ నెలలో నయినా చూలు కడతాయి. మేకలు బలమైనవి. రోగాలు తక్కువగా వస్తాయి. ఆకు, అలము తిన్నందువల్ల వాటికి జీర్ణశక్తి ఎక్కువ.

వీటిపై పెట్టుబడి తక్కువ, ఆదాయం ఎక్కువ. పెంపకానికి బ్యాంకులు రుణాలను యిస్తాయి. భీమా సౌకర్యం కూడా ఉంది. మేకల పెంపకం మంచి లాభం.

## ఎచ్చట పెంచాలి?

మేకలను ఎక్కడ పెంచాలి. ఇంతకు ముందు లాగా బీళ్ళలో - పొలాల్లో పెంచడం మంచిదా? లేదా షెడ్డులలో పెంచడం మంచిదా? ఆలోచించండి. బీళ్ళలో, పొలాలలో పెంచితే ఇబ్బందులున్నాయి. మేకలు బీళ్ళదాకా నడవాలి. అందుకు కొంత శక్తి కోల్పోతాయి. ఎండ, వాన, చలికి నీరసపడతాయి. ఇందుకు మేకల కాపరి కూడా కావాలి. పైగా అచ్చట దొంగలు, తోడేళ్ళ బెడద వుంది. బయటతినే గడ్డిలో పురుగులుంటాయి. త్వరగా వ్యాధికి గురవుతాయి. కనుక షెడ్డులో పెంచడం మేలు. షెడ్డు ఎండ, వాన, చలిని ఆపుతుంది. భద్రత ఉంటుంది. సరైన పశుగ్రాసం పెట్టవచ్చు. పశుగ్రాసం పాడుకాకుండా చూడవచ్చు. మంచి దానా మేపవచ్చు. తరచు వాటిని గమనించవచ్చు. మంచి చెద్దలు చూడవచ్చు.

అంటురోగాలకు గురికాకుండా చేయవచ్చు. ఎద కొచ్చిన మేకలను చూడి కట్టించవచ్చు. ఎరువు జాగ్రత్త పెట్టవచ్చు. ఎరువు అమ్మితే

మంచి లాభం. షెడ్‌లో బరువు పెరుగుతాయి. కనుక షెడ్‌లో పెంపకం లాభదాయకం. ఇది మంచి పద్ధతి.

## మేకలలో జాతులు

చాల దేశాలలో మేకలు ఉన్నాయి. ఇవి ఎన్నో జాతులలో ఉన్నాయి. మన దేశంలో ఇరవై జాతులు ఉన్నాయి. జాతులు మూడు రకాలు. పాలు ఇచ్చేది మొదటి జాతి. మాంసానికి పనికి వచ్చేది రెండవ జాతి. పాలకు, మాంసానికి రెంటికీ పనికి వచ్చే వాటిని మూడవ జాతి అంటారు.

వీటిలో కొన్ని మంచి జాతుల గురించి తెలుసుకుందాం. పాలు ఇచ్చే వాటిలో బీటలు, మలబారి మంచివి. బీటలు తెల్లగా ఉంటుంది. కాళ్ళు పొట్టిగా ఉంటాయి. 15-18 నెలలకు తొలి ఈతకువస్తుంది. తరువాత ప్రతి తొమ్మిది, పది నెలలకు ఒక ఈత. ఈతకు రెండు పిల్లలను యిస్తాయి. పాలు బాగా ఇస్తాయి. మలబారి తెలుపు - నలుపు లో ఉంటాయి. కాళ్ళు పొట్టిగా ఉంటాయి. ఎనిమిది, తొమ్మిది నెలలకు ఈనుతాయి. తడవకు రెండు, మూడు పిల్లలు పెడతాయి. తక్కువ తింటాయి. ఎక్కువ పాలిస్తాయి. దీని మాంసానికీ గిరాకి ఉంది. బెంగాల్ జాతి ఒకటుంది. ఇది మాంసానికి ఉపయోగం. తెలుపు, నలుపు, గోధుమ రంగులలో ఉంటాయి. చాల పొట్టి జాతి. చర్మం నాణ్యమైనది. త్వరగా కడతాయి. ఏడు మాసాలకోసారి ఈనుతాయి. రెండు మూడు పిల్లలను పెడతాయి. పెంచడం తేలిక.

పాలకు - మాంసానికి బార్బరీ జాతి మంచిది. తెలుపు, ఎరుపు రంగులో ఉంటాయి. మచ్చలతో ఉంటాయి. హైదరాబాదు ప్రాంతంలో ఇవి ఎక్కువ. ఇవి పాలను బాగా ఇస్తాయి. వీటి మాంసానికి గిరాకి ఎక్కువ. మెత్తని ఉన్ని గూడ ఇస్తాయి. కనుక ఇవి మూడు రకాల లాభం. మన వాతావరణంలో బాగా పెరుగుతాయి. షెడ్డులలో బాగా ఎదుగుతాయి. ఉస్మానాబాది అనే మరో జాతి. పాలకు, మాంసానికి



మంచిది. సైజులో చిన్నవిగా ఉంటాయి. నలుపు - తెలుపు రంగులో ఉండి పిల్లలను ఎక్కువ పెడతాయి. వీటిని పెంచడం సులువు. షెడ్‌లో ఏపుగా పెరుగుతాయి.

## మంచి మేకలు ఎలా ఉంటాయి

మనం మంచి జాతి మేకలను సేకరించాలి. సేకరణలో మెలకువలు పాటించాలి. పెద్దల సలహా తీసుకోవాలి. మంచి జాతి మేకలు వేరుగా

ఉంటాయి. అవి బలంగా ఉంటాయి. మంచి రంగు కలిగి ఉంటాయి. ఆరోగ్యంగా, చురుకుగా ఉంటాయి. లేడిపిల్లలా గంతులు వేస్తాయి. పొడుచుకుంటాయి. రెండేళ్ళు వస్తే చాలు నాలుగు పండ్లు వేస్తాయి. ఆరేడు మాసాలకే తొలి చూలుకి వస్తాయి. ఒకసారి ఈనాక త్వరగా చూడి కడతాయి. పెద్ద పొదుగు కలిగి మెత్తదనంతో ఉంటాయి. పాలు దండిగా ఇస్తాయి.

యిక మాంసం సంగతి సరేసరి. ఎదుగుదలను బట్టి మాంసం తూకం పెరుగుతుంది. మాంసం తూకాన్ని బట్టి ఆదాయం వస్తుంది.

## మేకల కొనుగోలు

మేక పిల్లలను కొనవచ్చు. ఆరేడు మాసాల మేకలను కొనవచ్చు. ఏవి కొన్నా జాగ్రత్తగా కొనాలి. ఎంపిక బాగా చేయాలి. అనుభవంతో చేయాలి. దళారులను పూర్తిగా నమ్మవద్దు. కొనే ముందు వాటిని పరీక్ష చేయించాలి. డాక్టరు సలహా తీసుకోవాలి. ఇచ్చిన డబ్బుకు రసీదు తీసుకోవాలి. వీటిని జాగ్రత్తగా ఊరు చేర్చాలి.

దారిలో మేత ఏర్పాటు చేయాలి. విశ్రాంతి తీసుకోనివ్వాలి. ఊరు చేరాక బాగా చూడాలి. వాతావరణం సరిపడేదాకా వీటిని ఒక కంట కనిపెట్టి ఉండాలి.

## ఎదలక్షణాలు - చూలు కట్టించడం

మేక పిల్లలు త్వరగా ఎదుగుతాయి. ఆరేడు మాసాలకే పెద్దవి అవుతాయి. ఆరోగ్యవంతంగా ఉంటే ఎదకు వస్తాయి. అలాగే పెద్దమేక ఈనాక రెండు మాసాలు చాలు, ఎదకు వస్తుంది. ఎదకు వచ్చిన మేకలను గమనించాలి. ఈ మేకలు ఇతర మేకలను దాటే ప్రయత్నం చేస్తాయి. మాటి మాటికీ ఉచ్చ పోస్తాయి. మేత సరిగా మేయవు. దాణా సరిగా తినవు. నీరు తగినంత తీసుకోవు.

జననేంద్రియాలలో మార్పు ఉంటుంది. అచ్చట నుంచి జిగురు లాంటి పదార్థం కారుతుంది. అపుడు ఈ మేకలను వేరు చేయాలి. పోతు మేక వద్దకు తీసుకెళ్ళాలి. ఈ పని రాత్రి వేళలలో చేయాలి. రాత్రి వేళ చూలు నిలచే అవకాశాలు ఎక్కువ. చూలు కట్టించిన గుర్తు చెవిపై వేసి వివరాలు పుస్తకంపై రాసుకోవాలి. పుస్తకంలో చూలు కట్టిన తేది, ఈనిన తేది, పిల్లలసంఖ్య - ఇలా అన్ని సంగతులూ రాసుకోవాలి. ఇలా ప్రతి మేక గురించీ రాయాలి. ఒక్కో మేక సంగతి ఒక్కో పేజీలో రాయాలి. ఈ సమాచారం అందరికీ ఉపయోగం.

## చూడి మేకల పోషణ

పాడి మేకలను బాగా పోషిస్తాం. అలా చేస్తే ఎక్కువ పాలిస్తాయి. ఎక్కువ లాభం ఉంటుంది. ఇక చూడి మేకల సంగతి అంటారా! అంతకంటె బాగా మేపాలి. అంతకు మించి బాగు ఓగులు చూడాలి. అపుడే అవి చలాకీగా ఉంటాయి. ఆరోగ్యకరంగా ఉండి మంచి పిల్లలను కంటాయి



ఎక్కువ ఆదాయం సంపాదిస్తాయి. కనుక చూడి మేకల సంగతి చూడాలి. చూడి మూడున్నర మాసాలే. కడుపులో పిల్లకు రూపం ఏర్పడుతుంది. కడుపు లావు అవుతూ ఉంటుంది. అప్పటి నుంచి మరీ జాగ్రత్త పడాలి.

మంద నుంచి చూడి వాటిని వేరు చేయాలి. ఉదయం, సాయంత్రం దానా పెట్టాలి. పచ్చి మేత, చెట్ల ఆకులు బాగా మేపాలి. ఖాళీ జాగాలో తిరగనీయాలి. ఈనే సమయం వస్తే, అటూ యిటూ తిరుగుతుంది. మాటి మాటికీ పడుకుంటుంది. మరల వెంటనే లేస్తుంది. పొదుగు ఉబ్బినట్లు, మెత్త బడినట్లు ఉంటుంది. ఈ సమయంలో ఆ మేకను వేరు చేయాలి. ప్రశాంత ప్రదేశానికి మార్చాలి. నేలను శుభ్రం చేయాలి. మెత్తని గడ్డి క్రింద పరచాలి. ఈ మార్పు వచ్చిన అరగంటలో ఒక పిల్లను ఇస్తుంది. తరువాత మరొక గంటకు ఒక పిల్ల. ఇంకొక గంటకు ఇంకో పిల్లను ఇవ్వవచ్చు. ఈనిన రెండు గంటలలో మాయ పడుతుంది. ఈ మాయను తీసి దూరంగా పాతి పెట్టాలి. ఈనడం సరిగా జరిగితే సరే, లేదా డాక్టరు సాయం తీసుకోవాలి. ఈనిన పిల్లలను తల్లి వద్దనే ఉంచాలి. తల్లి చేత నాకించాలి. ఈనిన మేకకు దానా పెట్టాలి. మంచి నీరు ఇవ్వాలి.

## మేక పిల్లల జాగ్రత్త

అప్పుడే పుట్టిన పిల్లలను బాగా చూడాలి. పుట్టిన వెంటనే ముక్కు రంధ్రాలు సరిగా ఉన్నవో లేవో చూడాలి. పైన పొర ఉంటే తొలగించాలి. నోటిపై పొర ఉన్నా తీసేయాలి. బొడ్డుకు టించర్, ఐడిన్ రాయాలి. ఇందువలన పుండు పడదు. పొదుగు బాగా కడగాలి. పిల్లల చేత చనుబాలు తాగించాలి. రోజుకు రెండు మూడు సార్లు తాగించాలి.

వాటిని పరిశుభ్రమైన ప్రదేశంలో ఉంచాలి. అవి నేలను నాకకుండా చూడాలి. అజీర్ణవ్యాధికి గురి కాకుండా చూడాలి. పాలతో రెండు వారాలు పెరుగుతాయి. తరువాత క్రీపు దానా, పచ్చి మేత అలవాటు చేయాలి.

ఆకు, సుబాబుల్ ఆకు, మెత్తని గరిక మంచిది. మేత
త నీరు తాపాలి. రోగాలు రాకుండా టీకాలు వేయించాలి.
టురోగాలు రావు. వీటికి ఎక్కువ వేడి తగులనీయరాదు.
కీ చలికి దూరంగా ఉంచాలి. మగ మేకలను మాంసానికి
టిని వేరుగా మేపాలి. ఒక నెల వయసు రాగానే విత్తనాలు
్పుడవి బాగా పెరిగి, మేతను బట్టి బరువు పెరుగుతా...
క్షు శుభ్రంగా ఉంచాలి. తరచు పొడి సున్నం చల్లాలి.
ండా ఉండాలి.

## మేకల మేత

) జాతి ఎంచుకోవాలి. ఎంచుకున్న వాటిని బాగా మేపాలి.
పితే అంత బాగా ఎదుగుతాయి. పిండి కొద్దీ రొట్టెగదా!
డి రెండు రకాలు - ఒకటి దానా. రెండవది మేత. దానా
). తొట్టె శుభ్రంగా ఉంచాలి. మేక వయసును బట్టి దానా
గే మేకలకు నలగగొట్టిన మొక్క జొన్నలకు, ఒక శాతం
డి. మంచి దానా అవుతుంది. అన్ని దానా దినుసులు
ం దానా అవుతుంది. దానా ఎంత అవసరమో మేత అంత

) జాతి గ్రాసాలు రెండు పాళ్ళు, కాయ జాతి గ్రాసాలు
) మేపాలి. చిన్న ముక్కలుగా కత్తిరించి మేపాలి. ఇందువలన
ను. ఖరీదయిన మేత కలిసి వస్తుంది. మేత మేశాక తగినంత
ఇది చాలా అవసరం. నీరు మంచిదై ఉండాలి. అందుకు
ంచిది. మురికి నీరు తాపరాదు.

## మేక పోతుల పెంపకం

ఏ మంచి వంగడం కావాలి గదా! అలానే మంచి మేకల



సంపద పెరగాలంటే మంచి జాతి మేకలు అవసరం. వీటినే మేక పోతులు అంటారు. మేక పోతులను బాగా పెంచాలి. వాటికి మంచి ఆహారం ఇవ్వాలి. వేరే వసతి ఏర్పాటు చేయాలి. ఒకో పోతుకు 300 గ్రాముల మిశ్రమ దానా కావాలి. ఒక కిలో చెట్ల ఆకులు మేపాలి. ఒక కిలో కాయధాన్యపు పచ్చి మేత కావాలి. దాటే రోజులలో దానా పెంచాలి. మంచి నీరు యివ్వాలి. ఎప్పుడూ షెడ్‌లో ఉంచరాదు.

రోజూ ఒకసారి బయటకు వదలాలి. బాగా తిరగ నివ్వాలి. బయట తిరిగేప్పుడు దాన్ని గమనించాలి. ఇతర మేకల పైకి పోనీయరాదు, దాటనీయరాదు. వాటిని పొడవ నీయరాదు. కలసి తిరిగేట్లు చేయాలి. చేసే అలవాటును బట్టి ఉంటాయి. మేకల కాపరి అంటే భయపడతాయి. వీటిని కర్రతో కొట్టరాదు. అపుడపుడు అదిలిస్తూ ఉండాలి.

## ఎంత మేత మేపాలి?

వయసును బట్టి మేత మేపాలి. పిల్ల మేకలు, పెద్ద మేకలు, చూడి మేకలు అని ఇవి మూడు రకాలు. పిల్ల మేకలకు బరువులో 5 శాతం మేత కావాలి. పెద్ద వాటిని బరువులో 4 శాతం మేత కావాలి. మేత ఏదైనా కావచ్చు. పచ్చి మేత, ఎండుమేత, చెట్ల ఆకులు వీటిని మేకలు ఆనందంగా తింటాయి. దీనికి తోడు కనీసం 250 గ్రాములు మిశ్రమ దానా పెట్టాలి.

చూడి మేతలకు మిశ్రమ దానా మరీ అవసరం. ఈనిన తరువాత కూడా ఈ దానా అవసరం. కనీసం ఒక నెల ఇలా మేపాలి. మేక పిల్లలకు జున్ను పాలు తాగించాలి. రోజుకు రెండు, మూడు సార్లు తాగించాలి. ఇలా రెండు వారాలు జరగాలి. మూడో వారం జున్ను పాలు ఆపవచ్చు. గడ్డి పరకలు తినడం నేర్పాలి. క్రీపు దానా పెట్టాలి. పచ్చి మేత అలవాటు క్రమంగా చేయాలి. పిల్లలు బాగా ఎదుగుతాయి. ఆరు నెలల్లో పెద్దవి అవుతాయి.

## మేకలకు వచ్చే రోగాలు

మేకలు బలంగా ఉంటాయి. త్వరగా పెరుగు తాయి. కళకళలాడుతూ తిరుగుతాయి. గంతులు వేస్తాయి. త్వరగా రోగాలకు గురి అవుతాయి. రోగం రాగానే మూలకు చేరతాయి. తల కిందికి వంచుతాయి. మేత తినవు, నెమరు వేయవు, నీరు తాగవు. కళ్ళు ఎర్రబడతాయి. పుసులు గడతాయి. కళ్ళ వెంట నీరు రావడం గమనింపవచ్చు. పారుడు రోగం వస్తే బక్క చిక్కిపోతాయి. నల్ల కప్పు వేస్తాయి. జ్వరం, దగ్గువస్తే ముక్కుల నుండి నీరు కారుతుంది. బుసలు వినిపిస్తాయి.

మేకకు రోగం వస్తే మిగతా వాటి నుంచి వేరు చేయాలి. డాక్టరు సాయం కోరాలి. డాక్టరు సూచనలు పాటించాలి. సొంత వైద్యం

చేయరాదు. అన్నింటి కంటే ముందు మేకలకు టీకాలు వేయించాలి. రోగాలు రాకుండా జాగ్రత్త తీసుకోవాలి.

## వ్యాధులు - చికిత్స

మేకలకు అనేక వ్యాధులు రావచ్చు. వాటిలో నిమోనియా, అజీర్తి, కడుపు ఉబ్బడం, పారుకోవడం, సామాన్యంగా వస్తాయి. మేకలు తాగే నీరు, పీల్చేగాలి, తినే మేత వలన గొంతువాపు, చిటుకు రోగం, పారుడురోగం, పొదుగు వాపు వస్తాయి.

**గొంతు వాపు:** ఈ వ్యాధివల్ల మేకలు మేత తినలేవు. గాలి పీల్చలేవు. నీరు తాగలేవు. జ్వరం, దగ్గు వస్తాయి. నీరసపడి పోతాయి. ఈ వ్యాధి వానాకాలంలో వస్తుంది.

**చిటుకు రోగం :** వర్షాకాలానికి ముందు వస్తుంది ఈ రోగం. ఈ రోగం సోకిన మేకలకు జ్వరం, కడుపు నొప్పి వస్తుంది. కొన్ని మేకలు పారుతుంటాయి. ఈ జబ్బు సోకితే వెంటనే చనిపోవచ్చు కూడా.

**పారుడు రోగం :** మేక పిల్లలలో ఈ రోగం ఎక్కువగా వస్తుంది. ఈ రోగం వస్తే పిల్లలు మెత్తబడతాయి. జ్వరం వస్తుంది. చీముతో పారు తుంటాయి. పాలు తాగవు. వెంట్రుకలు రాలి పోతాయి. వెంటనే గమనించకపోతే మూడు దినాలలో చనిపోతాయి.

## మేకల ఉత్పత్తులు

మేకల ఉత్పత్తులు చాలా ఉంటాయి. పాలు, మాంసం, చర్మాలు, ఎరువు, వెంట్రుకలు, ఇలా ఎన్నో... అన్నిటికీ గిరాకి ఉంది. అన్నీ అమ్ముకోవచ్చు. మేకల ఎరువు వేరుగా ఉంచాలి. గుంటలో వేయండి. దానిపై కొద్దిగా నీరు చల్లి, ఆపైన కొద్దిగా ఫాస్ఫేటు కలిపితే ఎరువు నాణ్యం పెరుగుతుంది. బాగా ధర పలుకుతుంది. అవసరం మేరకు సొంత పొలంలో వేయొచ్చు. మిగిలింది అమ్మకోవచ్చు. మిగతా ఉత్పత్తులు మార్కెట్‌లో అమ్మాలి.

దళారులకు అమ్మరాదు. పెట్టుబడి - ఆదాయం లెక్క రాయండి. ఇది చాలా అవసరం.

ఇందువలన మనకు లాభంవస్తుందో లేక నష్టపడుతున్నామో తెలుస్తుంది. ఏ పనైనా లాభదాయకంగా చేయాలి, నష్టపోరాదు. ఆ జాగ్రత్త అవసరం. అదే జీవితం, ఆనందమైన జీవితం.

Laserset at Printofast, 11/4 Old Rajinder Nagar, New Delhi - 110060 and
printed at Shivam Offset Press, Naraina Ph.1, New Delhi - 110028